శ్రీమత్కృష్ణ పరబ్రహ్మణే నమః.



# రుక్మిణీపతి శతకము.







శ్రీరమణీమనోహర వశీకృతలోక విశాలనేత్ర దు
ర్వారమహాఘనాశ కరిరాజవిపద్ధర గోపికామనో
హారి విలాసరాసనిపుణాచ్యుత భక్తనికాయమిత్ర స
ద్వారిద దేహ దివ్యవిభవా! ననుఁబ్రోవుము రుక్మిణీపతీ॥ ౧

ఉ. దేవనికాయవంద్య సముదీర్ణనిశాచరకాల యోగిరా
ట్భవనివాస కంసశయ శైవసంగ రసాబ్ధిపోత వి
ప్రావనభక్త నిత్యమహిమాంచిత సర్వవతారకంద గాం
ధివిమోహనాశక స్వీకృతవైభవ రుక్మిణీపతీ. ౨

ఉ. రుక్మిణిప్రాణమిత్ర వరరూపవిలాస విహంగయాన స
మ్రిక్మపటపరిశ్రుతగాత్ర ముఖజనావన మాంగనావమో
రుక్మమణిప్రవేక భవరోగనివారక దివ్యనామ త
ద్రుక్మిఘణిద్విషాంగ బహురూపక్షనృపాలక రుక్మిణీపతీ. ౩

ఉ. వారలవీరలన్నగలున భద్రము లేదని త్వన్మహార్థపూ
సారపునీతయందు గతిసారస నేత్రుఁడనైన నేనె యం
చూరటబల్కు నీదువచనోత్కరముల్ నినమ్మినాఁడ దే
వా! రజతాద్రికీర్తివిభవా కరుణింపుము రుక్మిణీపతీ. ౪

ఉ. భావమునందు నుత్పలవిభాసుర వృత్తశతంబు నీకు సం
భావితరీతి నేనిడి యవంధ్యఫలంబును బొందఁగోరెదన్
గావున నాదుయత్నమును గాదనక న్ఫలితంబు జేసి న
న్గావుము లోకనాథ! కరుణాశరధీ వరరుక్మిణీపతీ. ౫

ఉ. నీమహిమాబ్ధిలేశమును నిశ్చలతన్గనలేక నేటికిన్
యామృడపద్మజాదులు విహాస్యత నొందిరి దీనుఁడన్మహా
పామరుఁడ న్కృతఘ్నుఁడ నభంగుర పాపకరుండనైన. నే
నేమని నిన్స్తుతించెద నహీనగుణాకర రుక్మిణీపతీ. ౬

ఉ. పాపరతుండనైననను బాయక నీవిల రక్షఁ జేసినన్
దీపితకీర్తినై భువిన దీనతభాసిలెదీవు సద్వ్రతా
పాపుల గాచినన్యశము వచ్చునె యీవిధి నీకు మారవ
త్స్మాపతదంబువుల్సకలశ్లాఘ్యములౌఁగద రుక్మిణీపతీ. ౭

ఉ. వేదశిఖైకలక్ష్యుఁడవు వృద్ధపరాశరకౌశికాజి వ్యా
సాదిమహర్షిపణ్యుఁడవు వ్యాపృతసర్వగుణాకరుండ వా
పాదితసర్వలోకశుభభాసి వశేషశరణ్యమూర్తి వి
పాప్రకృతప్రపచ్ఛయుండ వభిపాతితకల్మష రుక్మిణీపతీ. ౮

ఉ. సర్వజనాంతరుండవయి సర్వమునీవె యొనర్తు కర్తవై
గర్వముచేత నేనె యనిగాఢతమంబున మున్గు జీవుఁడే
యుర్విని నీదుతత్త్వమును నొక్కఁగుఁడున్గ నలేఁడు తత్త్వతత్కృపా-
ఖర్వుఁడు దక్కమోహవిని ఘాతమొనర్పుము రుక్మిణీపతీ. ౧౪

ఉ. గీతనుబోలు శాస్త్రములు గీతకు వక్తల నాఁగ దేవుఁడే
యేతరుణంబునందు నిలనెక్కడ లేరని తత్త్వకోవిదుల్
ఖ్యాతిగఁ జెప్పుచుందురి నిజముఁ జెదగూడను విశ్వసించెడిన్
హితము చిత్తనిశ్చలత విశ్వసయామయ రుక్మిణీపతీ. ౧౫

ఉ. మానుషచేష్టలన్నివిరి మానవుమాడ్కి నటించి మూఢులౌ
మానవులందరన్మిగుల మాయకు వశ్యుల జేయుచుందు వి
ద్యైఁ నినున్నెవండు విశదానఘతత్త్వమునా నెఱుంగు స
న్మానసవాసి నీకుడగునా యటుచేయగ రుక్మిణీపతీ. ౧౬

ఉ. పండితుఁడైన గూడ నినుభాసురరీతిగ గానలేక సం
ఖండితచిత్తుఁడై కుటిల కామముఖాదులకగ్గమైను యి
ట్లుండగ మాదృశుల్మొరకు లజ్జలతోడ నినున్గనంగ నె
న్నుండునుశక్తులే దయయొనర్పుము నాపయి రుక్మిణీపతీ. ౧౭

ఉ. కామముఖారినాశక మఖండితసమ్మదమూలకంద మా
కామితవస్తుదాయకము గాఢతమోఽద్రికి వజ్రపాత మిం
ద్రామరవృద్ధభగ్నముఖరామరపాతకనాశకంబు ని
త్యామలపూర్ణసౌఖ్యదమహార్యమునీస్మృతి రుక్మిణీపతీ. ౧౮

ఉ. దానతపోముఖాదుల నతంద్రితఁ జేయ నశక్తుఁడ న్భవ
న్మానసరక్తిఁ జేయ నివిమానుగజాలునె భక్తిలభ్యుఁడ
న్నేనని దెల్పవే విమలనీతిని గీతలభక్తిఁగూడ నీ
స్త్వైనద యోపలభ్యమది తద్దయునాకిదు రుక్మిణీపతీ. ౧౯

ఉ. మాదృశమూఢులన్నటులఁ మాన్యగుణా తరియింపజేయనీ
వాఙ్మృతమత్యరూపివయి యుంపద వెన్నియొ దుష్టబాధలన్
యీదృశహర్గివంచు నొకడేనియు నీస్మరణంబుఁ జేయుడీ
వేదయమాకొసంగుము వివిక్తి భవత్స్మృతి రుక్మిణీపతీ. ౨౧

ఉ. మార్గమదంబుసౌరభము మాటొనరించినదాగునే మహా
నర్గళవిక్రమాత్త హరినాదము మాఱునె భిన్నవేషత
భర్గముఖార్చితాంఘ్రియుగ భాసురమైన భవన్మహత్త్వమున్
సార్గళమున్నొనర్ప పటువౌనె నృవేషము రుక్మిణీపతీ. ౨౧

ఉ. సర్వవిలక్షణుండవు సుశాసిత సర్వచరాచరుండ వా
శర్వముఖామరాదుల నచంచలవృత్తిని గాచువాడవు
ద్గర్వులఁ జెండువాఁడ వధికల్మషబల్బజ పావకుండవా
యర్వముఖాదితేయనుత హారియశస్వివి రుక్మిణీపతీ. ౨౨

ఉ. ఎవ్వనిలీలలో భువనహృత్యవనాదులు మృత్యుముఖ్యముల్
యెవ్వనిశక్తికి న్వొఱచు నెవ్వడు సర్వమునందు నిండెనో
యెవ్వనియాజ్ఞలేక సతమీశ్వర ముఖ్యతృణాంతవిశ్వమున్
నవ్వులకైనగాని చలనంబొనరింపదొ రుక్మిణీపతీ. ౨౩

ఉ. ఎవ్వనికర్మబంధములు మెప్పుడుగూడను నంటజాలవో
దవ్విదిదగ్గరంచు విదితంబుగ నేనికి లేదుభేదమో
యెవ్వనిచిత్రకృత్యములనింతయుగూడ నెఱుంగ రెవ్వరున్
యెవ్వడుదహ్రపద్మమున నింపుగ నిల్చునొ రుక్మిణీపతీ. ౧౪

ఉ. ఎవ్వడుపంచిపట్క-పరిహీనుడొ శుద్ధుడొ సర్వదేవతల్
యెవ్వనియంగకంబులొ మునీశ్వరులేనిని మెచ్చుగొల్తురో
యెవ్వడు సర్వయజ్ఞవ్రతహవ్యదత్తపోముఖకృత్యభోక్తయో
యెవ్వడు దీనరక్షకుడొ యేడుస్వతంత్రుడొ రుక్మిణీపతీ. ౧౫

ఉ. ఎవ్వనిదర్శనంబు సతమీశ్వరులౌ ముని దేవసంఘముల్
నెవ్వగదీరగోరుదురొ నిశ్చల నైజికతత్త్వమెవ్వడో
గవ్వయుగూడ జేయనివికారియు నెవ్వనిదృష్టిచేత రో
యవ్వకు పాత్రుడై బుధజనాంచితుడైమను రుక్మిణీపతీ. ౧౬

ఉ. విశ్వమయుండు సూరిజనవిశ్రుతభాగ్యము మాగృహంబు దు
ర్విశ్వనివారకుండు గుణవృత్తికిదూరుడు భక్తకల్పమిం
ద్రాశ్వసమానకీర్తి కరుణాంబుధి కామితదాత సర్వలో
కేశ్వరుడంచు నెవ్వడుశ్రుతీడ్యుడొ నిత్యము రుక్మిణీపతీ. ౧౭

ఉ. రాతిరికున్క-వేళ జనరాజిని నెవ్వడురక్షజేయునో
రాతిలొయున్నకప్పకును గ్రాశనమెవ్వడు సృష్టిజేసెనో
గీతలయందునెవ్వడవిగీతముగా నిజతత్త్వమేర్పడన్
ఖ్యాతిగజెప్పెనో యతనినాదృతిసెంచెద రుక్మిణీపతీ. ౧౮

# రుక్మిణీపతి శతకము.

ఉ. గీతలయంత్యవాక్యమవిగీతమటంచెద నమ్మినాఁడ నా
చేతగునంత నిన్ను నిజచిత్తమునందు దలంచువాఁడ దు
ర్భీతినిఁగొన్నవాఁడ బహురీతులబాధలనొందినాఁడ యో
తాత దయింపు నిన్విడువదారియులేదిక రుక్మిణీపతీ. ౨౯

ఉ. శోధనజేతునంచు నను శోషిలబాములఁ బెట్టఁబాడియే
వైధసమస్త్రమున్విచుకపైవిసు వన్వరశూరకీర్తియే
మేధకుదూరుడ జ్జననమృత్యుభయంబులఁగొన్నవాఁడ స
న్బాధలుఁబెట్టకయ్య దయనన్గనుమెప్పుసు రుక్మిణీపతీ. ౩౦

ఉ. సారపదార్థమంతయు ఘనాఘనదేహ భవన్నివాసమా
యారయ నీవెదానికిసమంచితరీతినివాసమాదు వీ
తీరు నెఱుంగుకోవిదులదీక్షతనిన్నె పరేశుఁడంచు సం
ధారణచిత్తులై సతమతంద్రతఁగొల్తురు రుక్మిణీపతీ. ౩౧

ఉ. సారములేని యీకుటిలసంసృతియందు రమించువాఁడ నా
ధారము దుఃఖసంతతికధఃకృతసౌధరసంబు తారకం
బారని పంటసంపదకధోక్షజ నీవరదివ్యనామమే
తీరున జెప్పిన న్ఫలమతిప్రథమౌగద రుక్మిణీపతీ. ౩౨

ఉ. సంపదలందవచ్చు వరశౌర్యముఁబొందగవచ్చు సద్యశ
స్సంపదబొందవచ్చు మహీచక్రమునేలగవచ్చు గాని స
చ్చంపకనాస పూర్ణశుభసంతతిపాకములేనిదే నరుం
డింపుగ నీపదాబ్జమధువెల్లురసించును రుక్మిణీపతీ. 33

ఉ. ఎన్నియొశాస్త్రజాలముల నిర్థమతిన్ గ్రహియించి నన్నరుం
డెన్నగనెంత తెల్విని సమృద్ధినిబొందిన తావకీనసం
పన్నకటాక్షలేశమునవంధ్యమునొందక యుక్తులెన్నియో
నెన్నిన దాటునేభవము పండునెచిత్తము రుక్మిణీపతీ. ౩౮

ఉ. స్వర్ణనిధిన్నరుం డుపరిసంచరణంబొనరించిన న్గన
ద్వర్ణశుభాంజనంబు నిలవర్గనఁజేసిలభించనట్లు యో
యర్ణవవర్ణ సర్వగుడవౌనినుమర్త్యుడుగానలేడు స
ద్వర్ణితభక్తి గైకొనక ధారిణినెప్పుడు రుక్మిణీపతీ. ౩౯

ఉ. మారవరస్య సేయములు మానితభూధ్రమ్మృదుత్వము ల్ఘనా
ధారకశాంతివర్తనలు దారుణకాకమనోజ్ఞగీతికల్
వారణబుద్ధిసౌఖ్యములు వారసతీభుజవర్తనల్వి ధా
గారభవాప్తమర్త్యభవకత్న్మృతులీ ధర రుక్మిణీపతీ. ౩౬

ఉ. పాత్రికృతసంగమంబున నపథ్యగతిన్బరియించుగాని య
పాత్రికృత దివ్యరూపవిభవప్రథితుండగు నిన్స్మరింప దా
పాకముఖాఘమీమనము భవ్యమనోజ్ఞ సుగంధలేపమున్
సూకర మిష్టపంకమెడఁ జొప్పడమెచ్చునె రుక్మిణీపతీ. ౪

ఉ. నీపదసంగమున్బొరసి నిర్మలకీర్తివహించె గంగ యా
పాపలతేడు నీశయున భావముచే నుతికెక్కె తార్క్ష్యుఁడున్
నీపున నిన్వహించి మహివిశ్రుతకీర్తినిమించె నీప్రియుల్
బాపురె యన్గబొందుదురవార్యముకీర్తిని రుక్మిణీపతీ.

ఉ. ఆగమపాఠము ల్పృథగుపాహరుదితంబులు దానధర్మముల్
భోగముదానికూటములు పూజితయాత్రలు రంధ్రపాత్రలో
సాగరశయ్య నీపదరసంబును గోరికయున్న గోరినన్
వేగమె యన్నియు న్సఫలవృద్ధిగనుంగద రుక్మిణీపతీ. ౩౯

ఉ. నీదయగల్గిన న్మహితనిర్మల సత్క్రియలేల గల్గదే
గాదనకుండఁజేసిన నుగాసియెగాని ఫలంబులేదు సం
వాదములేల కామినికిభర్త రుచింపరుచింపకుండినన్
తాదృశమార్దవంబగు సుతల్పము మోహము రుక్మిణీపతీ.

ఉ. వారుణిగ్రోలు మానవుని స్వాంతమువోలె మదీయచిత్త
మహ్వారిగకంపమాయెకృతవందితసజ్జనముఖ్యసత్క్రియల్
భారములాయె షడ్రిపులబారికిజిక్కితిదిక్కులేదు స
న్నారికిదెచ్చిబ్రోవుము నితాంతదయామతి రుక్మిణీపతీ. ౪౧

ఉ. కాకులువోలె లోకులతికారటనంబులొనర్తుగాక యు
త్సేకులు దుష్టపండితులు చిత్తమునందుహసింతుగాక న
న్నీకరనీపదాబ్జములెసేవ్యములంచెదనమ్మినాడ నే
ఖాకలువచ్చిన న్వెఱవ డంబముగాదిది రుక్మిణీపతీ. ౪౨

ఉ. దీనతనున్నబమ్మ కతిధీరతతో మునుమత్స్యరూపివై
యేనుగుమీదికేగు హరిణేశ్వరువోలె కృతాపరాధియా
దానవుదాకితన్మదమతంద్రత బాపి సమస్తవేదముల్
కామకలిచ్చుధీరుకుతుకంబునఁగొల్చెద రుక్మిణీపతీ. ౪౩

ఉ. ఎందరొ దేవదానవులు వృద్ధసుధారతిమంథరంబుమున్
బందుగ నాపలేక గడుపాట్లుబడన్దయకచ్ఛపాకృతిన్
క్రందములాపి దుర్భరనగంబును మోచిమథించిసంద్రమున్
సుందరమౌసుధన్నిడిన శూరునిగొల్చెద రుక్మిణీపతీ. ౪౪

ఉ. ధారిణినంతయున్గొని యథఃకృతసర్వదిగీశవీర్యుడై
బీరములాడుచు న్వెసనభీతిరసాతల మేగినట్టి యా
దారుణరాక్షసున్మృతునితద్దయుఁ జేసి యథాక్రమంబుగా
ధీరతభూమినిల్పు కిటిధీరునిఁ గొల్చెద రుక్మిణీపతీ. ౪౫

ఉ. బాలుని సాత్త్వికున్మిగుల బాముల పెట్టిన రాక్షసేశ్వరున్
యాలమునందు కాలభవనాతిథిగా నొనరించి లోకముల్
పాలనజేయుచు న్సురల భైరవదైత్యుల రూపడంచు స
చ్ఛీలు నృసింహవేషు నినుశీఘ్రము మేఁ గొల్చెద రుక్మిణీపతీ. ౪౬

ఉ. ఏమియుఁ గొంకులేక మదినింద్రునికై గడుగుజ్జురూపుతో
నేమముతోడ సత్క్రతువు నిశ్చలవృత్తినిజేయుదానవుం
తామసమొందకుండఁ గడుదాంతతనేడి బుధాలికెల్ల పూ
ర్ణామితమోదమిచ్చు లలితాంగుని గొల్చెద రుక్మిణీపతీ.

ఉ. రావణదర్పనాశకు నరాతిభయంకరు కార్తవీర్యునిం
గ్రావమువోలెదాకి రణరంగమునన్నుమియించి దుష్టులం
పాపముశుష్కవన్యములదగ్ధముజేసెడు మాడ్కిమాడ్చిసం
భావితవృత్తిదౌద్విజుని భక్తిని గొల్చెద రుక్మిణీపతీ. ౪౮

ఉ. విగ్రహధారిధర్మమన విశ్వమునందు యశంబు గాంచి దు
ర్విగ్రహ రావణాద్యసురవీరులఁ జెండి సమస్తలోకులన్
నుగ్రహసౌఖ్యులై వెలఁగ సూనృతరీతి రమించి మించు సా
రగ్రహుఁడైనరాఘవునిరక్తిఁ గొల్చెదరుక్మిణీపతీ. ౪౯

ఉ. చాలమదించు మించు ఖలచారుల పల్వలముఖ్య దుష్టులన్
నేలను గూల్చి భూజనుల నిర్భయుల న్సజేసి శౌరికిన్
మేలును గూర్చుచు న్సిరుల మించి రమించు వరేణ్యు రేవతీ
పాలుకృపాలుఁగొల్చెద శుభప్రతతిన్నిడ రుక్మిణీపతీ. ౫౦

ఉ. కావరమెక్కి నిక్కి దితిగాత్రజుల న్బలియింపబుద్ధ స
ద్భావమున స్తనర్చిరిపుభామినుల న్గికరించి శాత్రవా
భావముఁ జేసి వృద్ధనుతిభాసురుఁ డామహితాత్ము నెంచెదన్
భావవిశుద్ధికై సతము వాంఛితదాయక రుక్మిణీపతీ. ౫౧

ఉ. ఓయన నెన్నివంకలో సమూహము జేయగలేనిశుంఠలా
హాయనపండితప్రవరులందెసు మాన్యతనొందుచుండి ర
త్యాయతకీర్తులౌబుధులు హైన్యమునొందుచునున్నవారుపా
పాయతమైనయీసమయమందు దయ న్గనురుక్మిణీపతీ. ౫౨

ఉ. కాలముమారె దుష్టజనకాలమువచ్చె నశించెసత్క్రియల్
బాలిశులెల్లెడ న్బ్రబలివంద్యుల నెప్పుడు ధిక్కరించెదర్
మాలలుమాన్యత న్గనిరి మానవులెల్లెడశీర్ణవృత్తులై
వ్రీడనువీడివర్తిలిరివేగమె లెమ్మిక రుక్మిణీపతీ. ౫౩

ఉ. దుర్విషయంబులన్దవిలి దుర్వచనంబులచేతశిష్టులన్
గర్వమునొందిదూలుచుసకల్మషులై నినుసంస్మరింపకన్
అర్వసమేంద్రియాలివశులై చెడుకొంటెలు నేడుపూజ్యతా
ఖర్వతనొందిమించెదరుగాదనవేమిది రుక్మిణీపతీ. ౫౪

ఉ. శాడబులెల్లరాచరణబాహ్యత నొందివినష్టవృత్తులై
హేళనపాత్రులైరిభవదిష్టములౌ కులవృత్తిభేదముల్
వైళమెసంకరంబులయె బ్రాహ్మణశబ్దమొయన్యజాతికిన్
హాలహలంబుపోలెకటువాయె వినన్గదు రుక్మిణీపతీ. ౫౫

ఉ. ఏమిదికర్మమోయెరుగనెల్లెడ బ్రాహ్మణనామధారులీ
భూమినిపెల్లురేగితమపూర్వవిధుల్త్యజియించి యంత్యజుల్
నేమముతోడఁదాకిశ్రుతినిర్మలకృత్యముల న్వహించుచున్
తామసమొప్పసజ్జనుల తద్దహసింత్రిల రుక్మిణీపతీ. ౫౬

ఉ. వైదికమంత్రతంత్రపరిపాలితతావకదివ్యగేహముల్
మాదిగమాలలెల్లరనుమానములేక కుమంత్రశిష్టులై
గాదనకన్ప్రవేశమును గాఢముగానొనరించిరీమహిన్
గాదననీవుగూడ నిదికష్టముగాదొకొ రుక్మిణీపతీ. ౫౭

ఉ. తావకపూజలెల్లెడల తద్దయుమానెకుతర్కవాదముల్
యీవసుధన్జనించె జగమిట్టులనయ్యె సమస్తధర్మముల్
యూవిలభావమొందె నధికాఘముదుర్భరమాయె శిష్టులన్
గావగనీకుకాలమిదె గావునలెమ్మిక రుక్మిణీపతీ. ౫౮

ఉ. నిత్య నిరంజనుండవు వినిర్ధుతకాలసమస్తకర్మసం
గత్యధికోత్తరుండవునుగావె మహాత్మ కలంపనీకునే
కృత్యముగాదు నీవిటు లుపేక్ష నొనర్పగబాడిగాదుస
త్కృత్యముఖాదిధర్మముల స్థాపనచేయుము రుక్మిణీపతీ. ౫౯

ఉ. సాధులఖేదముల్పెరిగె సంతతముస్ఖలరాజికృత్యముల్
బాధనొనర్చె లోకమునభారతమండలమెల్ల వర్ణసం
బాధమునొందె సత్యముఖవర్యగుణంబులు గానరావుయో
సాధుశరణ్యకల్కితను చక్కనికాలము రుక్మిణీపతీ. ౬౦

ఉ. సర్వవతారకందమయి సాధులపాలిటి కామధేనువై
శర్వసురాదివంద్యమయి శాశ్వతకీర్తికినిత్యవాసమై
సర్వశుభప్రదంబయి విశాల గుణోత్తరమై వెలుంగునీ
భూర్వహదివ్యతేజమునుతూర్ణమెగాల్చెద రుక్మిణీపతీ. ౬౧

ఉ. దీనసువజ్రపంజరము తీవ్రభవాబ్ధికికుంభసూతి దు
ర్మానులకున్యమాయుధము మానులపాలిటిదివ్యవిత్తమౌ
జానకిభాన్వితంబఖిలజైత్రము భవ్యగుణాన్వితంబు నా
మానిత తేజమున్గొలుతు మైత్రినియెప్పుడు రుక్మిణీపతీ. ౬౨

ఉ. భానునియంమపాసకుని భాస్వరదక్షిణ నేత్రమందుస
న్మానులహృత్పయోజమునమానుగనిల్చెడుదివ్యమూర్తినై
యానవిహారపానశయనాదుల నెప్పుడునంతరాత్మవై
గానని సర్వదేహులను గాతువొకండవె రుక్మిణీపతీ. ౬౩

ఉ. నిష్ఠురకష్టసంతతియె నిత్యమునాకొనగూడె మన్మనో
భ్రష్ఠతసంభవించెఖిలబాధలు మిక్కుటమాయెమత్కృతా
నుష్ఠితులెల్లవంధ్యలయె నూతనమేధయు మొద్దువాఱెనా
నిష్ఠయునీరసించెనను నెమ్మదిగావుము రుక్మిణీపతీ. ౬౪

ఉ. ఏవయినన్కుబుద్ధినయి యేనిలవేఁలినకాఱులుండినన్
వావిరితోడవాట్నియొక వంకకు జేర్పకదీనుడైనన
న్నాభవమునంచు జేర్చి కృపభాసిలగావుము త్వాదృశుల్మహా
భావుల్లుదీనదోషముల పాటిగజూతురె రుక్మిణీపతీ. ౬౫

ఉ. గౌరవనీయులౌ గురుల గర్వమున న్వెసధిక్కరించితిన్
రౌరవమంచు నేనెఱిగి రాజితరీతి భవత్పదంబులన్
గారవమొప్పబట్టితిని గాచెదవో మఱినిగ్రహించెదో
భారమునీది పామరుడపాటిత పాతక రుక్మిణీపతీ. ౬౬

ఉ. ఆదరమొప్ప నాహృదయమందలి పాపములద్దహించి దు
ర్వాదులనేపడంచు బలవత్త్వమునిచ్చి మదీయవాంఛలన్
గాదనకన్ఫలింపగ నకల్మషరీతినిజేసి నిత్యత్వ
త్పాదరసంబు నాకిడి సతమ్మదయన్గను రుక్మిణీపతీ. ౬౭

ఉ. సర్వకలాసుధాబ్ధ్యమృతసారము వేదశిరస్సుభూష దు
ర్గర్వమదాద్రివజ్రము మఖవ్రతదానసుఫూర్తిదంబు హం
సార్వమృడాది సర్వజనస్వార్థద దివ్యరసాయనంబు యీ
యుర్విని నీదునామము సముజ్జ్వలవైభవ రుక్మిణీపతీ. ౬౮

ఉ. సారసనేత్రమంబు ధరచారువు సాగరపుత్రికా మనో
హారము సర్వపాపపరిహారము దుర్భవకంధిపోత మా
ధారము సర్వరోదసికిధార్మికవర్తన నిత్యతృప్తసా
స్ఫారసు తేజమింకొకటి పాటిగగలునె రుక్మిణీపతీ. ౧౯

ఉ. శారదచంద్రవక్త్రమును సారకృపారస మొల్కు కన్నులున్
చారువరాయుధద్వయయుగ జైత్రభుజంబులు నీలవర్ణమున్
స్వారసికప్రభావమున భాస్వరమైన మనోజ్ఞవేషమున్
తీరుగదాల్చు నీవిమలదేహము నెంచెద రుక్మిణీపతీ. ౨౦

ఉ. ముద్దుకుటాళియందునగ భుగ్వరపింఛము మందహాసమున్
హద్దునుమీఱినట్టి సకలావనిమోహక సుందరత్వమున్
యొద్దికతోడఁగొన్న నిను నొద్దని చెప్పిననాడు చిత్త మా
సుద్దులవీడి గొల్చెడిని శూరకులేశ్వర రుక్మిణీపతీ. ౨౧

ఉ. పాండవపక్షపాతివయి పాతకులైన సుయోధనాదులన్
గాండివధారి ముఖ్యనరకైతవ సైన్యము జేర్చినట్లు యో
తాండవకృష్ణ దుష్టులకు తాదృశమద్రిఫులన్వధించి బ్ర
హ్మాండమునందు నాకిడవె యాయతసౌఖ్యము రుక్మిణీపతీ.

ఉ. ధాతృమృడామర ప్రముఖధన్యకరార్చితమంబుజాల యా
శ్రితశిరోంచితంబు మృదుసారసపల్లవగర్వమోచకం
బాతతసత్ప్రభావము మృతార్జునపుత్ర సుజీవదంబు సం
పాతితసర్వదోషమగుపద్యుగ మెంచెద రుక్మిణీపతీ. 23

ఉ. వృత్తతనొందికాహళసుహృత్త్వము జూపివరేణ్యరూపసం
పత్తినిబొందుచూవతమపారముగానలరింప వేడుకన్
సత్తినిగొన్నమన్మథుని శాతశరాలయమోయనంగసం
విత్తినిజేయుజానుయుగి ప్రీతిని జేయుతరుక్మిణీపతీ. ౭౪

ఉ. శూరుల కైటభాదులనుగ్రుక్కఁగజేసినతీరు హస్తిశుం
డారితగొన్నసౌరు విరహాంచితగోపవధూసముల్లస
త్సారశరోపగూహనభవత్పులకల్గొను తేవ నెప్పుడున్
సారభవద్వరోరులనశాతతనెంచెదరుక్మిణీపతీ. ౭౫

ఉ. వైద్యుతకాంతులన్గెలుచు భర్మరుచిన్జెలువారి దృష్టిసం
పద్యుతదివ్యమోదమునపారముగా జనియింపజేయుచున్
సుద్యుతిసూత్రదివ్యకటిసూజ్జ్వలమౌ కనకాంబరంబునా
పద్యుతినాశ మొందనెదభావనజేసెద రుక్మిణీపతీ. ౭౬

ఉ. హామికసర్వలోకములనంతరితంబులజేసియున్నతం
బౌమునిముఖ్యులద్భుతమునంద కృశత్వమెబొందిబమ్మకున్
నేమముతోడ జన్మమునునిచ్చలరీతినొనర్చునాభికిన్
ధామము నైనకుక్షిని సతంబుస్మరించెదరుక్మిణీపతీ. ౭౭

ఉ. హారమహోజ్జ్వలంబువరుణాలయరీతిగదివ్యరత్నసం
ధారణదీప్రమిందిరకుధర్మసిహాసము కంఠభూషణ
స్ఫారమహఃప్రవాహపటుపాతనికేత మిలావిశాలమౌ
చారుసుగంధియౌయురముచయ్యననెంచెదరుక్మిణీపతీ. ౭౮

ఉ. దివ్యవరాయుధంబులతిదీనసతార్తిమహీంధ్రవజ్రముల్
భవ్యచయప్రదాయులతిభాసురహస్తరుచిప్రణద్ధముల్
నవ్యసుగంధలేపములు నమ్రితధూర్వహశత్రుమస్తముల్
భవ్యభవద్భుజంబులిల భద్రమునిచ్చుత రుక్మిణీపతీ. ౨౯

ఉ. కాంబవరోచిరుజ్జ్వలము కమ్రవిభూషణభాసురంబు స
జ్జాంబవతీముఖప్రవణచారుసతీపరిగూహితంబు నీ
లాంబరహార్దగూహనసుఖాప్తము రమ్యత్రిరేఖకంబు నా
సాంబనుతాభవద్గలమునాశ్రితనెంచెద రుక్మిణీపతీ. ౩౦

ఉ. సాధుసుధామయూఖరుచిసారముదాకృతికర్ణయుగ్మ మా
బాధితబింబికోష్ఠము శుభప్రదనేత్రయుగంబు సత్కృపా
లాధృతదర్పణప్రథిమ మాశ్రితచంపకనాసమైన నీ
సాధుముఖాంబుజంబు గనసత్వర వాంఛడ రుక్మిణీపతీ. ౩౧

ఉ. విశ్వవిభుత్వసూచకనవీనమణీద్ధకిరీటయుక్తమై
పశ్వధిపాదిదేవగణవందితమై వరలక్ష్మిదీప్రమై
నశ్వరభిన్నసౌఖ్యకరణంబున నిశ్చలమైదనర్చు నీ
విశ్వవిచేయమూర్తి నిడవే నయనంబుల రుక్మిణీపతీ. ౩౨

ఉ. ఏదియుగోరనిన్నునతబృందసమృద్ధినచోదితుండనై
గాదనకుండ నిచ్చెదవుగాన నిదొక్కటి యాలకింపుమీ
శ్రీదము సర్వపాపవినిషేధము సర్వశుభప్రదంబునీ
తాదృశనామమున్మదిని తప్పక నిల్పుము రుక్మిణీపతీ. ౩౩

ఉ. తానములాడకున్న పితృతర్పణకృత్యముఁ జేయకున్న సం
తానము నొందకున్న విధితంతువులన్వసఁ జిక్కకున్న నే
మేనియుహానిలేదు సకలేడ్యము తావక దివ్యనామమున్
పూనికనొక్కసారయిన పూర్తిగఁదల్చిన రుక్మిణీపతీ. ౭౩

ఉ. మోఘువచస్సులం దెరుచిముగ్ధతజిహ్వకుహస్తయుగ్మకిన్
మోఘువిధానసక్తియె సుపూర్ణముగాధన మెంతయేనియున్
మోఘముగానడంగు పరిపూర్ణభవత్స్మృతి వందనార్పణా
మోఘువిఘాల్గచింపగను మోహమెడంతయొ రుక్మిణీపతీ. ౭౪

ఉ. రోగికిపథ్యభోజనము సూక్తవచస్కున కచ్ఛవాక్యముల్
భోగికిసద్వ్రతంబులు కుభోగినికిన్నిజ భర్తృభక్తి దు
స్త్యాగికి సత్ప్రవర్తనము దారుణచక్రికి శాంతిపోలె దు
ర్భాగికినీపదాబ్జయుగభక్తి రుచించునె రుక్మిణీపతీ. ౭౫

ఉ. నాతికినాథుభక్తి మృగనాథునకున్వర శౌర్య ముల్లస
ద్వ్రతికియానకౌశల మవేల తపస్వికిశాంతివిత్తికిన్
యాతతదానమీశునక హైన్యసహాత్వము పోలె జన్మకిన్
పాతితపాపనీరతి యభంగురమౌ నగ రుక్మిణీపతీ. ౭౬

ఉ. కాననువేఱ దిక్కునతిగాఢముగా నవశత్వ మొందె నా
మానస మెప్పుడుఁగలుష మాదకదుర్గుణ జాల మెల్ల నా
తానవమానసస్థితుల తద్దయు పాడొనరించెనాథ నీ
కేనిక నేమిజెప్పుదను యేలుము దీనుని రుక్మిణీపతీ. ౭౭

# రుక్మిణీపతి శతకము.

చ. గీతను నమ్మినాతిన్నదను కృష్ణుడనెన్నియొ శాస్త్రజాలముల్
భాతిగ నేపఠించినను పథ్యములంచు దలంప నెప్పుడున్
ఖ్యాతిగనందయింప సమయంబిదె వచ్చెను సత్యవాక్కునై
యాతతకీర్తి నిల్పుకొనుమా సతముద్ధర రుక్మిణీపతీ. ౮౯

ఉ. ఇమ్ముగ సమస్తభోగముల నింపుదలిర్పగ చేతలేవియేన్
యిమ్ముగనున్న గొన్మనను నెప్పుడు వేపకు శక్తిలేదు ము
న్నెమ్ముగ నెన్ని యోనెతల బొలయితిన్నను గావనొక్కడేన్
యిమ్మహి లేడు దిక్కకనుయీవనినమ్మితి రుక్మిణీపతీ. ౯౦

ఉ. యోగులకైనగాని యధికోగ్రములౌ ఖలకామరోషముల్
బాగుగనాపగావశమె బాలిశులన్మముబోంట్ల జెప్పనే
లాగురుహస్తిసంచయమె యాశుగధాటికి దూలిపోవ నిం
కేగతినుండు తార్ణచయ మీ వెదలంపుము రుక్మిణీపతీ. ౯౧

ఉ. కూరిరతనొందు షడ్రిపులకున్వశమైగ్రహ సంగృహీతుడై
దారుణమర్త్యవృత్తి నిలదప్పక జేసితి గొన్ని వికృతుల్
పారములేదు నాకలుషపాలికి యోజగదీశ యెట్లొ న
న్తీరముజేర్పనీవెగతి దీనతగుందెడ రుక్మిణీపతీ. ౯౨

ఉ. గాఢతమస్సమాగృహము క్ష్మాతలిసన్మణిదీపకాంతిచే
బాధరుచిన్వెలింగి గలవస్తువులెల్లను జూపునట్లు సం
గూఢతమస్సమా మనము క్షోభనువీడి భవత్కృపాప్తిచే
రూఢములైన యర్థముల రూఢిగజూపుత రుక్మిణీపతీ. ౯3

ఉ. ఎందరినో విపన్నులను వృద్ధదయామతివైన నీవు యా
క్రందనమెల్లఁ బీడ ధరఁగాచితివందురు సమస్తకోవిదుల్
గుందెడ నావచస్సులకు కూరిమితో నను బ్రోవకున్న నా
క్రందన పుత్రమిత్ర మహిఁగావుము కీర్తిని రుక్మిణీపతీ. ౯౪

ఉ. కాళియునిన్నడంచితి వికావరమెక్కిన దుష్టదైత్యులన్
కాలునిపాలికంపితివి కాముక కుబ్జను చక్కఁజేసితౌ
పాడిగ నిన్ను నమ్మువర భక్తులనెల్లను గాచినాడవు
త్త్రాలవిచిత్రకృత్యుఁడవు ధారిణినెప్పుడు రుక్మిణీపతీ. ౯౫

ఉ. భూషణదూషణాదులను పూనికతో నొసరించువారికిన్
శేషశయా భవత్స్మృతియు సిద్ధముగాసిను నొక్కసిద్ధినే
ద్వేషములేల యీవిషయ సేవనమందు సుభోగ్యశర్కరా
వేషగుణంబు తెచ్చుటను వేఱగునా హరి రుక్మిణీపతీ. ౯౬

ఉ. మంచియొ చెడ్డయో గుణము మాఱునె నైజము వస్తుకోటికిన్
మించియజించినన్నిలవ మించిన నింబగుణంబు మాఱునే
యెంచిన నెంచకున్న గుణవృత్తులు కస్తురియందు మాఱునే
యుంచితమైన నీస్మృతికి నట్లె గుణంబది రుక్మిణీపతీ. ౯౭

ఉ. గబ్బితనంబు మాపు గడు గౌరవమిచ్చు హరించు పాపముల్
యెబ్బరికంబులేక జగమెంతయు ప్రాతముగా నొనర్చునే
కబ్బముఁ జెప్పకున్న ధనక్రమసుఖార్థము లెల్లనిచ్చున
బ్బబ్బ! భవత్పదస్మృతిమహత్త్వము స్వల్పమె రుక్మిణీపతీ. ౯౮

విహారపానశయనాదులనెప్పుడునాకునీస్మృతుల్
తరీతిగల్గననుమానములేకననుగ్రహింపుమా
లినాక్ష! యోవరద! యోకనకోజ్జ్వలరూప! యోమ
న! పతంగయాన! సితసారసలోచన! రుక్మిణీపతీ. ౯౯

సునితప్పులన్నియునుదండముతోసరియంచుపెద్దలీ
సునిగూఢనల్గువిశదంబుగజేకొనిచేతలన్నియున్
సికిదేకనేనిడెడువందనముల్గొనితావకీనుగాఁ
సినతంబుపాలనముజేయుముడాయుమురుక్మిణీపతీ. ౧౦౦

రక్తతనర్జునాఘములరచ్చకు దేకమెసూతకృత్యమున్
సక్తినొనర్చిసర్వజనసాక్ష్యముగా ధరపార్థసారథి
వ్యక్తపదంబునన్దనరినట్లు దయన్ననుగూడగాచి సం
క్తినిపిరరాఘువవరప్రదత న్గనురుక్మిణీపతీ. ౧౦౧

ఉ. తప్పులొయొప్పులోవరద త్వత్పరతన్నతకంబుఁజేసితిన్
ముప్పులురాకయుండమహిపూజ్యయశస్కులుదీన్నిజూచినన్
దెప్పుదురోమదిన్విషయదివ్యతచేతను మెచ్చుకొందురో
యెప్పగిదిన్దనర్చిననుయీవిలసాక్షివి రుక్మిణీపతీ. ౧౦౨

ఉ. ఉత్పలమాలికాశతమునుత్పలమాల్యరుచిన్వెలుంగుయో
సత్పితనీకుగూర్చితివిశాలదయన్గొనియాదరించుమా
మత్పితృమాతృసోదరసుమాన్యధరాధనముఖ్యవస్తువుల్
సత్పానీవెతథ్యముగసందియమేలను రుక్మిణీపతీ. ౧౦౩